# ఆంధ్రపత్రిక

J17234

The Andhra Patrika, Madras. | Regd. No. M. 1118 | Vol. 35 No. 223 | TUESDAY 16th NOVEMBER 1948 | వెల ఒక అణా | Founder: K. Nageswara Rao



# "దీర్ఘాయురస్తు": ప్రధానికి భారత ప్రజల శుభాశీస్సులు

## దేశమంతట పండిట్ నెహ్రూ 60 వ జన్మదినోత్సవ కోలాహలం

### ప్రపంచం నలుదిశలనుండి అభినందన సందేశాలు

న్యూఢిల్లీ, నవంబరు 14: ఆసేతు శీతాచలము అమితోత్సాహముతో, భారతీయులు యావన్మంది తమ ప్రధానమంత్రి 60 వ జన్మదినోత్సవములను వైభవోపేతమ్ముగ జరుపుచుండ, పండిటు జవహర్లాలు నెహ్రూ మాత్రము రాజధానియందు జరుగుచున్న వేడుకలకుకూడ హాజరు గాక, తన మనుమనితోను, తనకు "దీవన" లందచేయవచ్చిన 400 మంది బాలబాలికలతోను కాలక్షేపము చేయుచు ఈ పర్వదినమును గడిపెను. రాజ్యాంగపరిషత్తు కాంగ్రెసు పక్షము ఏర్పాటుచేసిన విందుకుమాత్రం హాజరైనారు.

భారతప్రధానామాత్యుడు పండిటునెహ్రూకు నేటితో 59 సంవత్సరములు నిండి 60 వ సంవత్సరము ప్రారంభమైనది. ఈ శుభసమయమున పండిట్ నెహ్రూకు ప్రపంచం నాలుగు చెరగులనుండి అభినందన సందేశములు వచ్చినవి. శుభాకాంక్షలు వెల్లి విరిసినవి.

గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు "మీరు చిరాయువులై మనవలెనని నేను సహస్రనామార్చన పురస్సరముగ భగవంతుని ప్రార్థించితిని" అను సందేశమును ప్రత్యేక పుష్పగుచ్ఛమును తన సైనిక కార్యదర్శిద్వారా పంపెను.

తన జన్మదిన ఉత్సవములు ఆడంబరముగ, వటాటోపముగా జరుపుటను పండిట్జీ నిరుత్సాహపరచెను. తత్సంబంధమైన ఉత్సవములలో పాల్గొన ఆయన నిరాకరించెను. కాని ప్రజల ఉత్సాహానందములను ఆయన నివారింపలేకపోయెను. ఉదయము అనేకమంది మిత్రులు పండితుని దర్శించి "దీర్ఘాయుష్మంతుడవుకమ్ము" అని దీవించిరి. ఆగంతుకుల ప్రవాహము ఉపప్రధాని సర్దార్ పటేల్‌తో ప్రారంభమైనది.

తక్కిన మంత్రివర్గము తదుపరివచ్చి కలసికొనిరి. రాజ్యాంగనిర్మాణ సభికులు, ఢిల్లీ రాష్ట్రీ కాంగ్రెస్ ప్రముఖులూ, వైజ్ఞానిక, వాణిజ్య, కార్మికసంస్థలకు చెందిన ఇంకనూ అనేకమంది ప్రతినిధులునూ ప్రధానిని పుష్పమాలాలంకృతుని జేసి జోహారు లర్పించిరి. కొందరు పండ్లు, పుష్పములు, మిఠాయిలు, కానుకలు తెచ్చిరి. కొందరు గ్రంథములను బహూకరించిరి.

**రాజాజీ శుభసందేశం**

గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారిగారు ఒక పుష్పగుచ్ఛమును శుభాకాంక్షలను పంపిరి.

"మీరు అనేక వత్సరములపాటు చిరాయువులై మనవలెనని, నేను సహస్రనామార్చన పురస్సరముగా భగవంతుని ప్రార్థించియున్నాను" అని ఆసందేశమునందు తెలుపబడినది.

గవర్నర్ జనరల్ బహూకృతిని తీసుకొనివచ్చిన సైనిక కార్యదర్శి కలనల్ చటర్జీగారిని ప్రధాని గృహప్రాంగణమునందు జన సమూహ మధ్యనిల్చి లోనికి పోసీయరైరి. ప్రధానియే స్వయముగా ముంగిలిలోనికి వచ్చి ఆ బహూకృతిని, సందేశమునూ స్వీకరించిరి.

తన మందిరము చుట్టునూ మూగిన ఆ జన సమూహమును చూచి ఆయన ఇంచుక

[3 పేజి చూడుము]

'తాతా మనుమలు'

## రాజ్యాంగముసాయిదాపై క్లాజువారీ చర్చ

### 'ఇండియా' పేరు మార్పు విషయమై చర్చ వాయిదా

న్యూఢిల్లీ, నవంబరు 15: భారత రాజ్యాంగపు ముసాయిదా క్లాజువారీ చర్చకు రాజ్యాంగ పరిషత్తు ఈ ఉదయము సమావేశమైనది. ఉపాధ్యక్షుడు హెచ్. సి. ముఖర్జీ గారు అధ్యక్షత వహించిరి. భారతదేశము 'సర్వ స్వతంత్ర రిపబ్లిక్' కావలెనా, 'సర్వ స్వతంత్ర డెమోక్రెటిక్ రిపబ్లిక్' కావలెనా, 'సర్వ స్వతంత్ర డెమోక్రెటిక్ స్టేటు' కావలెనా అను విషయము తేలువరకు క్లాజువారీ చర్చను వాయిదా వేయుట అవసరమని మౌలానా హస్రత్ మోహానీగారు తెచ్చిన అభిశంసనను అధ్యక్షుడు త్రోసివేసెను. ఏ బిల్లుపై చర్చలోనైనను ఉపోద్ఘాతమును (పియాంబుల్) కట్టకడపట చర్చించుట ఆచారమని చెప్పి ముఖర్జీగారు తమ రూలింగును బలపరచుకొనిరి.

మౌలానా హస్రత్ మోహానీగారికి పరిషత్తులో ఉపోద్ఘాతముపై చర్చ జరుగునప్పుడు, సవరణ రూపమున వారిసూచనను చర్చించుటకు అవకాశము ఇచ్చెదరు.

రాజ్యాంగములో 'ఇండియా' అను పేరు మార్చివేయవలెనని వచ్చిన దాదాపు 12 సవరణలపై చర్చను ఇప్పుడు సాగింపక వాయిదా వేయవలెనని అనంతశయనం అయ్యంగారు సూచించగా, అందుకు పరిషత్తు ఆమోదించెను. ఇండియా అను పదము స్థానే "భారత్" అనీ, 'భరతవర్షము' అనీ, 'హిందూస్థాన్' అనీ మార్చవలెనని కొందరు సభ్యులు సూచించిరి. రాజ్యాంగ ఉపోద్ఘాతముపై చర్చవరకు ఈ సూచనలపై చర్చను ఆపివేయవలెనని అనంతశయనం అయ్యంగారు కోరిరి.

సింధురాష్ట్రమునుండి అనేకమందిహిందువులు వచ్చివేయుటచేత, సింధుశాసనసభలో ముస్లిమేతర సభ్యులకు స్థానములు రద్దు అయినవనీ, ప్రస్తుతము ఇండియాలో దాదాపు 14 లక్షల మంది సింధీయులు వున్నారుకాబట్టి భారతరాజ్యాంగ పరిషత్తులో వారి ప్రతినిధులకు స్థానమిచ్చు యేర్పాటు జరుగవలెననీ ఒకసభ్యుడు నేటి పరిషత్ సమావేశములో ప్రతిపాదించెను. ఉపాధ్యక్షుడు ముఖర్జీగారు ఆ సమస్యను ఇప్పుడు చర్చించుటకువీల్లేదనితీర్పుఇచ్చిరి.

క్లాజువారీ చర్చ ప్రారంభముకాగానే ప్రొఫెసర్ కె. టి. షాగారు "యూనియన్ ఆఫ్ స్టేట్స్" కు ముందు 'సెక్యులర్' 'ఫెడరల్' 'సోషలిస్టు' అను పదములను చేర్చవలెనని ఒక ప్రతిపాదన చేసిరి. ప్రజలు ఆశించుచున్నట్లు 'సెక్యులర్, ఫెడరల్, సోషలిస్టు యూనియన్ ఆఫ్ ఇండియా' స్థాపనేతన సవరణ ఆంతర్యమనికూడా షాగారు విశదపరచిరి.

కేంద్రప్రభుత్వము ఫెడరల్ విధానమునుగాక సంపూర్ణ ఏకఛత్రాధికారమును చెలాయించవచ్చునని దురభిప్రాయమును పోగొట్టుటకు "ఫెడరల్" అను పదమును చేర్చవలెననీ, దేశ కాల పరిస్థితులనుబట్టి మతాతీతమైన 'సెక్యులర్' (లౌకిక) రాజ్యము కాగలదనికూడ వివరించుట ముఖ్యమనీ, ప్రతి పౌరునికీ సమానన్యాయమును, సమానావకాశమును చేకూర్చురాజ్యమని హామీ ఇచ్చుటకు 'సోషలిస్టు' అను పదమును చేర్చవలెనని ప్రొ॥ కే. టి. షాగారు తమ ప్రతిపాదనను బలపరచుకొనిరి. ప్రతివ్యక్తి తనశక్తికొలది పనిచేసి సహాయపడవలెనని రాజ్యము కోరుచున్నదనీ, సౌఖ్యప్రదమైన జీవయాత్రకు కావలసిన సదుపాయములు ప్రతివ్యక్తికీ లభించగలవనీ చెప్పుటకుకూడ 'సోషలిస్టు' పదము ఉపయోగపడగలదనిరి.

షాగారు ఇంక యిట్లుకూడ చెప్పిరి: "దౌర్జన్యధోరణిని అనుసరించకుండానే దీన్ని సాధించుటకు అవకాశము వున్నదనే నా నమ్మకము; పెట్టుబడిదారీ వర్గముల నిర్మూలనకు తీవ్రవిప్లవము చెలరేగగలదని భయపడవలసిన అగత్యములేదు."

రాజ్యాంగరచనా సంఘ అధ్యక్షుడు డా॥ అంబేద్కర్‌గారు ఈ సవరణను ప్రతిఘటించిరి.

రాజ్యాంగమనునది ప్రభుత్వములోని

(4-వ పేజీ చూడుము)

## "గాంధీజీకి నిజమైన రాజకీయ వారసుడు పండిట్ నెహ్రూ"

### రాజ్యాంగపరిషత్తు కాంగ్రెస్ పక్ష అభినందనసభలో సర్దార్ పటేల్ ప్రశంస

న్యూఢిల్లీ, నవంబర్ 14: "గాంధీమహాత్ముడు పండిత నెహ్రూను తన రాజకీయ వారసుగా ఎంచుకున్నాడు. ఆయన ఎన్నిక సరియైన వ్యక్తికే అన్వయించినదన్న విషయం ఎంతో ఆనందం కలిగిస్తున్నది. పండిత నెహ్రూ నిజంగానే గాంధీజీ ఆశయాలను అనుసరిస్తూ, ప్రపంచ జాతులలో భారతదేశమునకు ఉన్నత స్థానమును సంపాదించ కలిగెను. నేనూ, పండిత నెహ్రూ, సోదరులవలె 30 సం॥ల నుంచీ ఎంతో అన్యోన్యంగా మెలుగుతున్నాము." అని ఇండియా సహాయప్రధాని సర్దార్ పటేల్, నేడు రాజ్యాంగపరిషత్ కాంగ్రెసుపార్టీవారు జరిపిన నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంలో ఉపన్యసించుచూ ప్రశంసించెను.

ప్రశంసలకుసమాధానమిచ్చుచూ పండిత నెహ్రూ ఈ క్రిందివిధంగా ప్రసంగించెను: "అహింసాయుత పోరాటమే కాకుండా ఉన్నట్లయితే, స్వాతంత్ర్యోద్యమం దేశంలో ఇంత విరివిగా వ్యాపించి యుండేదే కాదు. అధికార దౌర్జన్యప్రధానమైన ఉద్యమం అతిత్వరలోనే అణచబడి ఉండేది. అహింసాయుత పోరాటం జరిగినదికనుకనే లక్షలమంది ప్రజలు ప్రాణాలుగోల్పోకుండా తప్పిపోయినది. సర్దార్ పటేల్‌తో నాకుగల సంబంధం 30 ఏళ్ల పైనుంచీ ఉన్నది. ఆయన సహాయసంపత్తి లేకుండా ఉన్నట్లయితే నేను ప్రభుత్వ నిర్వహణం చేయకలిగి ఉండేవాడిని కాదు."

రాజ్యాంగ పరిషత్తు ఉపాధ్యక్షుడు అనంతశయనం అయ్యంగార్ పండితనెహ్రూకు పూలమాలను వేయబోగా, సర్దార్ పటేల్ దాని నందుకొని తానే నెహ్రూకువేసి కౌగలించుకొనెను. ఇది ప్రేక్షకుల హృదయమును కదిలించినది. సభ్యులు ఉత్సాహానందములతో హర్షధ్వానాలు చేసిరి.

అనంతశయనంగారు ప్రసంగిస్తూ "గాంధీజీ భారతదేశంలోని ప్రజాకోటికి తన రాజకీయ వారసుడయిన పండితనెహ్రూను సర్దార్ పటేల్‌ను ఆయనకు సర్వసేనానిగా ఏర్పరచి—ఒప్పగించెను. వారిరువురికీ దీర్ఘాయువు కలుగుగాక" అని వాంఛించెను.

## జపాన్ దురాక్రమణ విధానమునకు శ్వేతజాతి ఆధిక్యతా సిద్ధాంతమే దోహదం చేసినదని జస్టిస్ పాల్ తీర్పు

టోకియో, నవంబరు 14: 1915 నుంచి 1923 వరకు ఆస్ట్రేలియా ప్రభుత్వం, అందులో ముఖ్యంగా ప్రధాన మంత్రి విలియమ్ మోరిస్ హ్యూజెస్ అవలంబించుచూ వచ్చిన విధానమే, జపానును రెచ్చగొట్టి యుద్ధానికి దించిందని, అంతర్జాతీయ యుద్ధ నేరస్థుల విచారణ సంఘంలో ఇండియా ప్రతినిధిగా ఉన్న న్యాయమూర్తి పాల్ తన తీర్పులో చెప్పెను.

యుద్ధ నేరస్థులుగా నిందితులైన జపానీయులు నిర్దోషులనీ, విలియమ్ మోరిస్ హ్యూజెస్ అనుసరించుచూ వచ్చిన జాత్యహంకార అహంభావ విధానమే జపానును యుద్ధానికిపురికొల్పిందనీ, పాల్ తనతీర్పులో నిర్మొహమాటముగా నొక్కిచెప్పెను.

ఆసియా జాతీయులు నికృష్టులనీ, జన్మసిద్ధంగాను, ఆర్థికంగాను, సాంస్కృతికంగానూ, తామే అందరికన్న ఘనులమనీ శ్వేతజాతీయులు గర్వించడం జపానుకు దుస్సహమైపోయింది. నానాజాతి సమితిలో జపాను ఈ సమస్యలన్నిటినీ సమదృష్టితో పరిష్కరించడానికి ప్రయత్నించినది; కాని ఆస్ట్రేలియా ప్రతినిధివర్గం, శ్వేతజాతీయులే పురుషోత్తము లన్న వాదమును లేవదీసి, జపాను చేసిన రాజీ ప్రయత్నము లన్నిటినీ భగ్నమొనర్చింది.

న్యాయమూర్తి పాల్ చేసినఆరోపణపై విలియమ్ మోరిస్ హ్యూజెస్ వ్యాఖ్యానం చేస్తూ ఇలా అన్నాడు:

"అన్ని జాతులు సమానమే అన్న క్లాజును వర్సైల్స్ ఒడంబడికలో నేను చేర్చనివ్వనిమాట వాస్తవమే. ఆ క్లాజును చేర్చనిచ్చి ఉన్నట్లయితే, ఆస్ట్రేలియా అంతా ఈపాటికి జపానీయుల మయమై ఉండేది. న్యాయమూర్తిపాల్ చేసిన ఆరోపణలు అమిత ఆశ్చర్యకరంగాను, అసంగతంగాను ఉన్నవి."

## రాష్ట్రపతికి, కార్యవర్గ సభ్యులకు ఖాదీవస్త్ర బహూకరణ

జైపూర్, నవంబరు 14: అఖిలభారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షునకు, కాంగ్రెసు కార్యవర్గసభ్యులకు, రాజపుటానా కాంగ్రెస్ కార్యకర్తలు చేతితో వడికి తయారు చేసిన ఖాదీ వస్త్రములను బహూకరించుటకు, జైపూర్ కాంగ్రెసు మహాసభ ఆహ్వాన సంఘమువారు సంకల్పించిరి. కాంగ్రెసు నాయకులు ఖాదీ ఉత్పత్తి కేంద్రములను దర్శించుటకుగాను, సెప్టెంబర్ 17 నుంచి 23 వరకు ఒకవారము ప్రత్యేకించబడెను. ఈ వారము రోజులపాటు కాంగ్రెసు నాయకులు, ఖాదీ ఉత్పత్తి కేంద్రములను దర్శించి, స్థానిక కాంగ్రెసు కర్తలు బహూకరించు ఖద్దరును ఖద్దరు నూలును, నాయకులు స్వీకరించెదరు.

## పండిట్ నెహ్రూకు స్టాలిన్ శుభాకాంక్ష

భారత ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూకు 60-వ జన్మదిన సందర్భమున పలుప్రాంతముల నుండి శుభాకాంక్షలు, అభినందన సందేశములు వెల్లివిరిసినవి. సోవియట్ ప్రధాని జనరలిస్సిమో జోసెఫ్ స్టాలిన్ స్వయంగా అభినందన సందేశము పంపెను. రాజకీయ లాంఛనములను పరిగణింపక, భారతదేశంలోని సోవియట్ రాయబారి ద్వారాగాక నేరుగా భారత ప్రధానికే తన సందేశమును పంపెను. భారతదేశపు మాజీగవర్నర్ జనరల్ లార్డు మౌంటుబాటన్ కూడ ప్రత్యేక సందేశమును పంపెను.

## బ్రిటిష్ సింహాసనానికి 2వ వారసుడు

### ఎలిజబెత్ యువరాణికి పుత్రోద్భవం

లండను, నవంబర్ 15: ఎలిజబెత్ యువరాణి గతరాత్రి 9 గం. 14 ని.కు మగశిశువును ప్రసవించినది. ఇండియా కాలమానప్రకారం ఆ సమయం 2 గం. 44 ని. లగును. బకింగ్‌హాం రాచనగరులో తల్లి, బిడ్డ క్షేమముగా ఉన్నట్లు, ప్రసవసమయమున హాజరైన 4 గురు రాజవైద్యులు ప్రకటించిరి.

ఎలిజబెత్ యువరాణి అనంతరం బ్రిటిష్ సింహాసనము నధిరోహించుటకు హక్కుదారుడైన శిశువు జన్మించినాడన్న శుభవార్త విద్యుద్వేగంతో లండను అంతటా ప్రాకిపోయినది. జనం గుంపులుగుంపులుగా బకింగ్ హాం భవనంవద్దచేరి హర్ష కోలాహలం మిన్నంటేటట్లు గావించిరి.

ఈవార్తవినగానే శిశువుతండ్రి ఎడంబరో ప్రభువు గబగబ పురిటిగదివద్దకు పరుగెత్తెను. తరువాత తనపుత్రుని రాజుగారికి, రాణిగారికి చూపించెను. తరువాత కొం. చెంసీపటికి రాజమాత మేరీకూడ ఏతెంచెను.

ప్రధాని అట్లీ ఈ వార్తవిని "నాకు చాల సంతోషంగా ఉన్నది." అన్నాడు.

పుత్రోద్భవవార్త వెలువడగా ఆచార ప్రకారం లండను మేయరుకు పంపబడినది ఎడింబరో ప్రభువు మాల్టాలో ఉన్న తన పినతండ్రి లార్డు మౌంటుబాటెన్‌కు, యూరప్‌లో ఉన్న తన తల్లికి, చెల్లెళ్లకు ఈ వార్తను వెంటనే తంతిద్వారా పంపెను. కామన్వెల్తు గవర్నరు-జనరలులకు కూడ

(4-వ పేజీ చూడుము)

## హ్రస్వదృష్టి, సంకుచితతత్వం పోవాలని పండిట్ నెహ్రూహెచ్చరిక

### ప్రపంచరాజ్యాల్లో భారతదేశ ప్రముఖస్థానం

న్యూఢిల్లీ, నవంబరు 14: గురునానక్ జన్మదినోత్సవ సందర్భమున భారత ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ, నేడు సిక్కుల సభలో ప్రసంగించుచూ, భారతదేశమేనాడు, ప్రపంచ రాజ్యములపై తన పలుకుబడిని ఉపయోగించగల స్థితిలో నుండుటేగాక, మరొక ప్రపంచ యుద్ధం సంభవించగల అవకాశమును తగ్గించగలదని, ఉద్ఘాటించెను. "అయితే సంకుచితత్వమునకు లోనుగాకుండా భారతదేశం తన్నుతాను కాపాడుకొనుచూ, సమతూకంలో పుండునేడలనే, యీ పనిచేయగలదు" అని పండిట్‌జీ హెచ్చరించెను.

ప్రపంచములో ప్రస్తుతము ప్రజ్వరిల్లిన అశాంతినిగురించి ప్రస్తావించుచూ, యీ అశాంతివలననే, మానవజీవితమునకు మూలాధారమయిన విలువలు ప్రపంచమునకు కనుమరుగైనవని, ప్రపంచరాజ్యములీనాడు, పరస్పర అనుమానము, అపనమ్మకములతో కూడుకొన్న పంథానే అనుసరించుచున్నవని పండిట్ నెహ్రూ నుడివెను.

"ప్రపంచ రాజ్యములు, గతానుభవమునుబట్టి గుణపాఠము నేర్చు ప్రయోజనము పొందనిచ్ఛగించుటలేదు, తత్కారణముచే, ద్వితీయ ప్రపంచ సంగ్రామము ముగిసినవెనువెంటనే, మరొక మహా భీకరసంగ్రామము వచ్చునన్నమాటలే వినిపించుచున్నవి.

ఇటీవల నేను ఐరోపాఖండమునకు వెళ్లినప్పుడు, అచట వివిధ రాజ్యముల నాయకులను కలుసుకోగల అవకాశము నాకు

4 వ పేజి చూడుడు

# ప్రత్యేక ఆంధ్రమహా రాష్ట్రముల నిర్మాణము

## నెలాఖరులోగా భాషా రాష్ట్ర సంఘ నివేదిక

న్యూఢిల్లీ, నవంబరు 14: భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనసమస్య సత్వరమే పరిష్కరించదగినది కాదని భారత ప్రధానామాత్యుడు నెహ్రూ రాజ్యాంగపరిషత్తు సమావేశములో ప్రకటించిన ఫలితముగ, ఈ సమస్యకు ప్రత్యేక ప్రాధాన్యమేర్పడినట్లు కొంతమంది కాంగ్రెస్ నాయకులు అభిప్రాయ పడుచున్నారు.

రాజ్యాంగపరిషత్తు అధ్యక్షుడు నియమించిన భాషారాష్ట్ర విచారణసంఘము ఈ మాసాంతములోగా తొలి నివేదికను అందజేయవచ్చును. ఆంధ్ర, మహారాష్ట్ర ప్రత్యేకరాష్ట్రముల నిర్మాణముపట్ల ఏకగ్రీవాభిప్రాయము ఇచ్చట గోచరమగుచున్నది. తిరువాన్కూరు, కొచిన్ సంస్థానములను, ఉత్తర మలబారు జిల్లాలను చేర్చి ఐక్య కేరళరాష్ట్ర స్థాపనకు కూడ అనుకూల్య మేర్పడుచున్నట్లు ఢిల్లీ చేరిన వార్తలు తెలుపుచున్నవి.

ఐక్యకేరళ స్థాపనకు కొచిన్ సంస్థానము సర్వదా సుముఖముగనే వున్నది. తిరువాన్కూరు సంస్థానములో ఇటీవల జరిగిన మంత్రివర్గ మార్పుల ఫలితముగ అచ్చటకూడ ఐక్యకేరళ స్థాపనకు సుముఖభావము ఏర్పడినది. రాజకీయ ప్రముఖులు దీని అవకాశములను గురించి చర్చించుచున్నారు; కావలసిన వివరములన్నియు తయారగుటకు కొంత వ్యవధిపట్టవచ్చు. (ఐ. వి.)

# రామపాదసాగరం ప్రాజక్టు

## ప్రజలసంఘం రాయబారం

మదరాసు, నవంబరు 15: సర్ ఎస్. వి. రామమూర్తిగారి నాయకత్వమున రామపాదసాగర ప్రాజక్టు ప్రజల సంఘం తరఫున ఒక రాయబారవర్గం, ఢిల్లీకి 19 వ తేదీన పోనున్నది. వీరు యీ ప్రాజక్టునకు ప్రాధాన్యతనొసంగి ముందుగ పని ప్రారంభించమని అధికారులను కోరుదురు. 18 వ తేదీన మదరాసులో యీ సంఘ కార్యవర్గమువారు సమావేశమై యీ రాయబారవర్గము పంపుటకు నిశ్చయించిరి. ఈ సమావేశమునకు గౌ॥ రివిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు కూడ హాజరై, ఢిల్లీ సభలో జరిగిన చర్చల గూర్చి తెలిపినట్లు తెలియుచున్నది.

# హొనాన్, షాంటంగ, హొపే రాష్ట్రరాజధానులు కమ్యూనిస్టులవశం

## ఉత్తరచైనాలో ప్రభుత్వసేనల పరాజయం

టిన్‌సాట్సిన్, నవంబరు 14: హోపే రాష్ట్ర రాజధాని, పీపింగ్-టీన్‌ట్సిన్ రైలుమార్గానికి సింహద్వారమూ అయిన పావ్‌టింగ్‌నుంచి ప్రభుత్వసేనలు ఖాళీ చేయటం ప్రారంభించినవని తెలుస్తున్నది. ఈ నగరానిపై పోరాటం కొన్నినెలలనుంచే జరుగుతున్నది. ఈ మధ్యనే కమ్యూనిస్టుల ఒత్తిడి తీవ్రతరమైనది. కమ్యూనిస్టులు నగరానికి 40 మైళ్లలో ఉన్నారనీ, ప్రభుత్వసేనలు గొరిల్లాయుద్ధంతో మధ్యహోపే రాష్ట్రాన్ని రక్షించవలచుకున్నారనీ ప్రభుత్వవర్గాలవలన తెలుస్తున్నది.

హొనాన్‌రాష్ట్రరాజధాని కైఫెంగ్, షాంటంగ్ రాజధాని ధినాన్ కమ్యూనిస్టులకు ఇంతకుముందే స్వాధీనమైనవి. వారిప్పుడు షాన్సీరాజధాని టయువాన్‌కూ, షియువాన్ (ఇన్నర్ మంగోలియాలో) రాష్ట్రరాజధాని క్వెయిసూయికీ ప్రమాద పరిస్థితులు కలిగించిరి. టయువాన్‌వద్దగ నగర బాహ్యరక్షణల దగ్గర పోరాటం జరుగుతున్నది.

ఉత్తరచైనాలో పరిస్థితులు ఈవిధంగా విషమించటం తెలుపుతూ, ప్రభుత్వ సేనాల కదలికలనుగురించి పత్రికలు యథేచ్ఛగా ప్రకటించటం హానికరమని ప్రభుత్వం హెచ్చరిక చేసినది.

### అమెరికా సహాయం

వాషింగ్టన్, నవంబరు 14: మార్షల్ పథకంకింద, గడచిన బుధవారంతో అంతమైనవారంలో అమెరికా చైనాకు 2,32,77,000 డాలర్ల సహాయం చేయబడినది. ఇదివరకు రష్యా, ఫ్రాన్సులలో అమెరికా రాయబారిగా ఉన్న విలియం బులిట్ ఇప్పుడు చైనాకు చేయబడుతున్న అమెరికా సహాయ కార్యక్రమాన్ని పరిశీలిస్తూ షాంఘయ్, మొదలైనచోట్ల పర్యటన చేయుచున్నాడు. ఇతడు ఒకటిరెండు రోజులలో షాంఘయ్ రానున్నాడు. చాంగ్‌కైషేక్ పరిస్థితి తిరిగి బాగుపడవలెనంటే అమెరికా ఇంకా ఎక్కువగా, అతి త్వరలో సహాయం చేయవలసి ఉంటుందని షాంఘయ్ చైనీయవర్గాలు భావిస్తున్నారు.

### తంతీసౌకర్యాల నిలుపుదల

బొంబాయి, నవంబరు 14: ఈ క్రింది చైనా పట్టణాలతో తంతి సౌకర్యాలు తిరిగి తెలియజేసేవరకు నిలుపుచేయబడినవని చైనాప్రభుత్వం తెలియజేసినదని తంతి తపాలాశాఖ ప్రకటించినది: చెఫూ, చెంగ్‌సీన్, కైఫెంగ్, లోయాంగ్, ముక్డెన్, సింకియాహ్వాంగ్, ఇతర ఈశాన్య చైనా రాష్ట్రాలు.

# ఆర్. యస్. యస్. సంఘచాలకుడు గోళ్వల్కర్ డిటెన్షన్

నాగపూర్ నవంబరు 14: రాష్ట్రీయ స్వయంసేవక సంఘచాలక్ శ్రీ ఎం. ఎస్. గోళ్వల్కర్ ఈ వేళ ఢిల్లీనుండి పోలీసు కావలాతో తీసుకొని రాబడెను. విమానాశ్రయం నుండి ఆయన నాగపూర్ సెంట్రల్ జైలుకు తీసుకొని పోబడి డిటెన్షన్‌లో ఉంచబడెను.

# ఢిల్లీకి స్వామి రామానందతీర్థ ఆగమనం

## నాయకులతో సంభాషణ

న్యూఢిల్లీ, నవంబరు 14: హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు, స్వామీ రామానంద తీర్థ, కార్యవర్గ సభ్యులు, డా॥ మేల్కోటే, పరీక్ గార్లు నేడు ఉదయం ఢిల్లీకి విచ్చేసిరి. స్వామి రామానంద తీర్థ, డా॥ పట్టాభి సీతారామయ్య, శంకర్‌రావ్ దేవ్ గార్లను కలుసుకొని సంభాషించెను. స్వామి, పండిత నెహ్రూను సందర్శించి, జన్మదినోత్సవ సందర్భమున తన అభినందనలు తెలిపెను.

రేపు సర్దార్ పటేల్, పండిత నెహ్రూగారలను తీర్థ కలుసుకొనును.

గుంటూరు జిల్లాజడ్జిగ ఎం. కన్నబాబుగారి స్థానే అడ్జింగ్ పర్మనెంటుగాను నియమింపబడిరి.

# సమితి అధ్యక్ష కార్యదర్శుల విజ్ఞాపన చర్చకు బ్రిటిష్ మంత్రివర్గ సమావేశం

## బెర్లిన్ ప్రతిష్టంభన: పారిస్‌లో నేడు పశ్చిమరాజ్యాల విదేశాంగమంత్రుల చర్చ

లండన్, నవంబరు 15: బెర్లిన్ సమస్యపై అగ్రరాజ్య చతుష్టయము సంప్రతింపులను పునః ప్రారంభించవలెనని ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ అధ్యక్షుడు డా॥ హెర్బర్టు ఇవాట్, సమితి కార్యదర్శి ట్రిగ్వెలై చేసిన విజ్ఞప్తిని చర్చించుటకుగాను బ్రిటిషుమంత్రివర్గం నేడు సమావేశమగును. సమావేశమునకు ప్రధాన మంత్రి అట్లీ అధ్యక్షత వహించును.

### పశ్చిమరాజ్యాల విదేశాంగ మంత్రుల సమావేశం

పారిస్, నవంబరు 14: బెర్లిన్ వివాదమును పరిష్కరింపబడు, అగ్రరాజ్యముల నాయకులు సత్వరమే ప్రయత్నించవలెనని, ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు ఎవాట్, కార్యదర్శి ట్రిగ్వేలీగారలు నిన్న చేసిన విజ్ఞప్తిని చర్చించుటకు, పశ్చిమరాజ్యత్రయ అధికారులు, మంగళవారంనాడు పారిస్‌లో సమావేశము కావలెనని, బ్రిటన్ సూచింపనున్నట్లు నేడు తెలియవచ్చినది.

ఈ సమావేశములో, అమెరికా విదేశాంగమంత్రి జార్జి మార్షల్, ఫ్రెంచి విదేశాంగమంత్రి రాబర్టు షూమన్, బ్రిటిష్ విదేశాంగమంత్రి ఎర్నెస్ట్ బెవిన్ పాల్గొనెదరు. బెవిన్ తరఫున యీ సమావేశములో పాల్గొనుటకు, హెక్టర్ మెక్నీల్, పారిస్ తిరిగివచ్చుచున్నారు.

బెర్లిన్ వివాదము పరిష్కరించవలసినది భద్రతామండలియేనని స్పష్టము చేయుచూ, అక్టోబరు 17 న, పశ్చిమ రాజ్యత్రయ విదేశాంగమంత్రులు, తమ ప్రకటనలో తెలిపిన వైఖరి యథాతథముగానే ఉన్నదని బ్రిటిష్ ప్రభుత్వాభిప్రాయమై యున్నట్లు తెలియుచున్నది.

బ్రిటన్‌లో అమెరికా రాయబారిగా ఉన్న, లూయీ డగ్లస్, జార్జి మార్షల్‌ను కలుసుకొను నిమిత్తం ప్యారిస్ వచ్చెను.

వీరు ఉభయులు చర్చించు ముఖ్యవిషయములలో, బెర్లిన్ సమస్యకూడా ఒకటని, మామూలు విశ్వసనీయ వర్గములద్వారా తెలియుచున్నది.

బెర్లిన్‌పై సోవియట్ దిగ్బంధము ఉన్నంతకాలమూ, ముఖాముఖి సంప్రదింపులకు తావులేదని, పశ్చిమరాజ్యముల తాలూకు రాజకీయవేత్తల అభిప్రాయం. బెర్లిన్ సమస్యా పరిష్కారము సాధించియే విజ్ఞప్తిచేసినను అది సోవియట్ రష్యా నష్టేకించి చేయవలసినదేనని పశ్చిమరాజ్యములు చెప్పిన అది సహేతుకము కాకపోదని, వీరి ఉద్దేశ్యము.

బెర్లిన్ నగరంపై దిగ్బంధము తొలగింపబడనంతకాలమూ, సోవియట్ రష్యాతో సంప్రదింపుల పునఃప్రారంభం అసంభవమని, అమెరికా పునరుద్ఘాటించవచ్చునని అనుకొనుచున్నారు.

# అధిక ద్రవ్య చలామణి నిరోధమునకు భారత ప్రభుత్వ చర్య

న్యూఢిల్లీ, నవంబరు 15: అధిక ద్రవ్య చలామణిని నిరోధించడానికి సహాయకారం అవుతుందన్న ఉద్దేశ్యంతో, భారతప్రభుత్వం ఈ క్రింద పేర్కొన్న వస్తువులను, బహిరంగ జనరల్ లైసెన్సు కింద దిగుమతి చేసుకోవడానికి అనుమతి ఇచ్చినది:

మద్యపానీయాలు; చుట్టలు; సిగరెట్లు; పొగాకు; సబ్బు; బొత్తాలు, సిల్కు; ఆర్టిసిల్కు; దంతపు వస్తువులు; ఆటవస్తువులు; మోటారుకార్లు.

# తెలంగాణాలో కమ్యూనిస్టు బెడద నిర్మూలించుటకు పోలీసు చర్యలు

## జిల్లా పోలీసు అధికార్లకు ఉత్తరువులు

హైదరాబాద్, నవంబరు 14: హైదరాబాద్ ప్రధాన సివిల్ పరిపాలనాధికారి డి. ఎస్. బాక్లే, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఏ. వి. పాత్రోగార్లు వరంగల్లు, కరీంనగర్, నల్లగొండ జిల్లాలలో నాలుగు రోజులపాటు పర్యటన జరుపుటతో యీ జిల్లాలలో కమ్యూనిస్టు బెడద లేకుండా చేయుటకు తీవ్రంగా పోలీసు చర్యలు తీసుకొనబడునని విశ్వసింపబడుచున్నది.

కరీంనగర్ జిల్లాలో కమ్యూనిస్టు బెడద ఏమీ లేదనే చెప్పవచ్చునట. అయితే నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో మాత్రం కమ్యూనిస్టులు యింకా తమ దౌర్జన్యవిధానమును కొనసాగించుచున్నారని తెలియుచున్నది. సూర్యాపేట, నరకటపల్లి యీ రెండును కమ్యూనిస్టులకు బలమైన స్థావరములట.

ఈ జిల్లాలలో కమ్యూనిస్టుల విషయమై కఠినంగా ప్రవర్తించవలసిందని జిల్లా పోలీసు అధికారులకు ఉత్తరువులు పంపబడినట్లు తెలియుచున్నది.

ఈ జిల్లాల పర్యటన సందర్భంలో బాక్లే పాత్రోగార్లు స్థానిక నాయకులు హిందువులు, ముస్లిములను కూడ కలుసుకొని పరిస్థితులు తెలుసుకొనిరి. ప్రస్తుత పరిపాలనక్రింద పరిస్థితులు తృప్తి కరంగానున్నవని వారు తెలియజేసిరి.

బాక్లే పాత్రోగార్లు తిరిగి నవంబరు 17 న ఉస్మానాబాద్ జిల్లాలలో పర్యటించుటకు వెళ్లెదరు.

### మిలిటరీట్రక్కు ప్రమాదం

హైదరాబాద్ మిలిటరీ గవర్నరు సంస్థాన ఉత్తరజిల్లాలలో పర్యటించుచున్న సందర్భంలో, అతనివెంటనున్న పత్రికా విలేఖరుల మిలిటరీ ట్రక్కు నిన్న సాయంకాలం జాల్నాకు 20 మై. దూరంలో ప్రమాదమునకు లోనై రోడ్డుప్రక్కనున్న కాలువలో పడిపోయెను. ట్రక్కులోనున్న పత్రికావిలేఖరులకు, పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరుకు స్వల్పగాయములు తగిలినవి. గాయపడినవారిని తక్షణం జాల్నా ఆస్పత్రికి తీసుకొనిపోయిరి. అక్కడనుండి ఔరంగాబాద్‌కు చేర్చిరి. వారు నేడు సికందరాబాదునకు తీసుకొనిరాబడి కె. ఇ. ఎం. ఆస్పత్రిలో చేర్చబడిరి.

### కమ్యూనిస్టుల దురాగతం

భద్రాచలం, నవంబరు 10: నిజాం ఇలాకా పాల్వంచ తాలూకా యెర్రకాపురగ్రామ, మస్తేదారు అయిన పామిరు రామారావుగార్ని సాయుధులయిన సుమారు 20 మంది కమ్యూనిస్టులు ఎత్తుకుపోయిరి. రామారావుగారికి 60 ఏండ్లు. గ్రామంలోని బూర్గంపాడు ఎస్. ఎ. పి. దళము నేడు ఉదయం బయలుదేరి శ్రీనరసింహాపురం తిమ్మాపేటవారు కలిసిరి. కాని వారిజాడ కన్పించలేదు. అనంతరం గ్రామస్థులు మిలటరీ గుర్తు కెళ్లిరి. కనుక కమ్యూనిస్టులు నల్లపల్లి చేరి పోలీసులు నాశనం చేసియున్నారు.

### హైదరాబాద్‌లో ప్లేగు

హైదరాబాద్ సంస్థానంలోని పలు ప్రాంతాల నుంచి ప్లేగు వ్యాధిని గురించిన వార్తలు వచ్చినవి. అక్టోబరు మాసంలో 264 మందికి ప్లేగు తగిలినదనీ, ఇందులో 63 గురు మరణించినారనీ, అధికారుల లెక్కలు చెప్పుచున్నవి. ఒక్క హైదరాబాద్ నగరంలోనే 233 మందికి ప్లేగు తగిలినదనీ, 45 మంది మరణించినారనీ తెలియుచున్నది. వ్యాధి యింకా ఉధృతంగా వ్యాపించకుండా అధికారులు తగు చర్యలు తీసుకొనుచున్నారు.

### రజాకార్ అనే అనుమానంపై అరెస్టు

నిజామాబాదు, నవంబరు 10: స్థానిక స్పెషల్ బ్రాంచి పోలీసువారు, ఎం. ఎ. ఖాన్ అనువానిని రజాకార్ అనే అనుమానంపై అరెస్టుచేసిరి. అతనివద్ద అభ్యంతరపెట్టదగ్గ పత్రములుండగ వాటిని స్వాధీనపరచుకొనిరి.

### హెబియస్ కార్పస్ దరఖాస్తుల వాయిదా

చెన్నపట్నం, నవంబరు 15: ప్రజారక్షణ చట్టముక్రింద నిర్బంధితులైన ఆర్. ఈశ్వరన్, ఎస్. రామస్వామి, ఎస్. ఏ. ..గార్ల తరఫున దాఖలు చేయబడిన హెబియస్ కార్పస్ దరఖాస్తులను న్యాయ హోరేస్, న్యాయ గోవిందమేనన్‌గార్లు యీ దినం విచారణకు తీసుకొని ప్రభుత్వం కోరినందుకు నిమిత్తం కేసులను యీ నెల 25 వ తేదీకి వాయిదా వేసిరి.

# మున్షీ రాజీనామా

## భారత ప్రభుత్వ అంగీకారం

బొంబాయి, నవంబరు 14: హైదరాబాద్‌లో భారత ఏజంట్ జనరల్‌గానున్న కె. ఎం. మున్షీగారు తన పదవికి పెట్టిన రాజీనామాను భారతప్రభుత్వం అంగీకరించినది. అందువలన ఆయన ఉద్యోగకాలం నేటి అర్ధరాత్రితో ముగియగలదు. పండిత నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంలో నేటి సాయంత్రం ఇచ్చట జరిగిన ఒక బహిరంగసభలో ఉపన్యసించుచూ మున్షీగారు ఈ విషయమును వెల్లడించిరి.

# నిజాం రాజబంధువుల సంఘ అధ్యక్షుడు

## విశ్వాసరాహిత్య తీర్మానం

హైదరాబాదు, నవంబరు 14: నిజాం రాజబంధువుల సంఘంవారు (మజ్లిస్-ఎ-సాహెబ్ జాదా) వారు నేడు సమావేశమై సంఘ అధ్యక్షుడు మీర్ గౌహర్ అలీఖాన్‌పై విశ్వాస రాహిత్య తీర్మానముచేసిరి. సంఘకార్యదర్శి తీర్మానము ప్రతిపాదించుచు, సంస్థానంలోని ప్రస్తుత మారిపోయిన పరిస్థితులలో గౌహర్ అలీఖాన్ సంఘ అధ్యక్షుడుగా ఉండుటకు తగడని చెప్పెను. తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడెను. తర్వాత వసీఫ్ అలీఖాన్ సంఘ అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకొనబడెను. హైదరాబాద్‌పై పోలీసుచర్య జరిగిన తర్వాత వచ్చిన గొప్ప మార్పులను గురించి ప్రసంగించుచు వసీఫ్ అలీఖాన్, తగిన సమయంలో భారత ప్రభుత్వం జోక్యం చేసుకొన్నందుకు కృతజ్ఞత తెలియచెప్పెను.

సర్దార్ పటేల్ 74 వ జన్మదినోత్సవ సందర్భంలో నిజాం రాజబంధువులసంఘ కార్యవర్గంవారు పటేల్‌గారికి అభినందన సందేశము పంపదలచి ఆ సందేశంపై సంతకం చేయవలసిందని అధ్యక్షుని కోరగా అతడు నిరాకరించుటచే కార్యవర్గం అతనిపై విశ్వాసరాహిత్య తీర్మానము చేసెను.

### కమ్యూనిస్టుల దౌర్జన్యం

మచిలీపట్నం, నవంబరు 12: దివి తాలూకా పెదముత్తేవి గ్రామంలో 17 మంది కాంగ్రెసు వాములను దాదాపు 100 మంది కమ్యూనిస్టులు నిన్న తీవ్రంగాకొట్టి గాయపరచినారని తెలిసినది. గాయపడినవారు చికిత్సకొరకు స్థానిక ప్రభుత్వ ఆస్పత్రికి కొనిరాబడిరి

# యజమానులకార్మికుల సామరస్యం అవసరం

## జయప్రకాశ నారాయణ ఉద్బాటన

న్యూఢిల్లీ, నవంబరు 14: ఇండియన్ లేబరు బోర్డువారి యాజమాన్యమున నిన్న ఇక్కడజరిగిన సభలో మాట్లాడుచు సోషలిస్టు నాయకుడు జయప్రకాశనారాయణ, ప్రస్తుత దేశపరిస్థితి ననుసరించి దేశములో పారిశ్రామిక ప్రశాంతి అవసరమనియు, కార్మికులను యజమానులుకూడా కొంతకాలము తమ కోరికలను సంక్షేపించుకొనవలెననీ, కార్మికులకు న్యాయమైన జీతములూ, యజమానులకు న్యాయమైన లాభములు ఉండి ప్రజలు ఆహారముమీదను ధరలమీదను గల నిర్బంధములు సహించవలెననియు, కార్మికులకు గృహాదికములైన సౌకర్యములుండవలెననియు, పారిశ్రామిక శాంతి నెలకొల్పు ఏర్పాట్లు చురుకుగానూ స్వతంత్రముగానూ, న్యాయముగానూ జరుగవలెననియు చెప్పెను. (యు. పి. ఐ.)

# పాకిస్తాన్ ప్రజలవలస కంట్రోల్ ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, నవంబరు 14: అనుమతిపత్రం లేకుండా పాకిస్తాన్‌లో ఏ ప్రాంతంనుండియైనా, యెవరైనా భారతదేశమునకు రాకూడదని, నిషేధము విధించుచూ, నవంబరు 13 వ తేదీన భారత గవర్నర్ జనరల్ జారీచేసిన ఆర్డినెన్సు తూర్పు పాకిస్తానుకు వర్తించదని భారత ప్రభుత్వము నేడు ప్రకటించెను.

# కలకత్తా పరిస్థితి

కలకత్తా, నవంబరు 14: ఈరోజు కలకత్తా నగరములో చెప్పుకోదగిన పెద్దసంఘటనలేమీ సంభవించలేదు. నగర మధ్యప్రాంతమున అక్కడక్కడా చెదురుగా, కొద్ది దెబ్బలాటలు జరిగినవనీ ఫలితముగా ఇరువురికి గాయములు తగిలినవని వారిలో ఒకడు హాస్పటల్‌నందు మరణించెనని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం తెలిపెను. నిన్న అల్లరులు జరిగిన ప్రాంతములలోనే గాక, మాచిపురా పోలీసుస్టేషన్ ప్రాంతములోకూడా కర్ఫ్యూ తిరిగి అమలుజరుపబడెను. మిలటరీ, పోలీసుదళములు రోజంతా గస్తీ తిరుగుచునే ఉన్నది. నగరంలో యింకనూ ఉద్రిక్తత కొంత ఉన్నది.

# ఆహార సప్లయి

వివిధ రాష్ట్రముల ఆహారశాఖ కార్యదర్శుల సభ యీసారి ఢిల్లీలోగాక కలకత్తాలో యీ నెల 26 లేక 27 తేదీలలో జరుగును. అప్పుడు ఆహార ధాన్యాల సప్లయి గూర్చి చర్చింపబడును. 1949 సం॥ నికి ఏ రాష్ట్రానికెంత కావాలో! కూడ చర్చింపబడును.

# భూమి అమరకంలో సంస్కరణలు

## అభివృద్ధిశాఖ మంత్రి వివరణ

న్యూఢిల్లీ, నవంబర్ 13: "గడచిన కొద్ది నెలలలోనూ ప్రస్తుత కాశ్మీర్ ప్రభుత్వం భూమి అమరకంలో ప్రవేశ పెట్టబడిన సంస్కరణలవలన రాబోవు ఎన్నికలలో దానికి విజయావకాశములు మరింత ఎక్కువయినవి. దేశంలోని ప్రతి రైతూ, ప్రస్తుత ప్రభుత్వం వనుక తనకెన్నడూ లేనిదానిని సమకూర్చినదని గ్రహిస్తున్నాడు. కాశ్మీర్ జాతీయ మహాసభను సమర్థించకపోతే నష్టపడేది తామేనని ఈ ప్రజలంతా గ్రహించి ఉన్నారు." అని కాశ్మీర్ అభివృద్ధిశాఖామంత్రి గులాంమహమ్మద్ సాదిక్ నేడు పత్రికా విలేఖరుల గోష్టిలో రాష్ట్రాభివృద్ధికి తమ ప్రభుత్వము చేయుచున్న కృషిని వివరించుచు తెలియజేసెను.

దేశములో ఒకమూల కొద్దిమంది శత్రువులింకా ఉన్నప్పటికీ మిగిలినచోట్ల పరిస్థితులు మామూలు దశలోకి వస్తున్నవనీ, ఇప్పుడు కనుక ఒక్కుమ్మడిగా దెబ్బతీస్తే శత్రువులను పూర్తిగా తరిమివేయగలమనీ ఆయన హెచ్చరించెను.

రాష్ట్రాభివృద్ధి కార్యక్రమములను ఆయన ఈక్రింది విధముగా వివరించెను.

"కాశ్మీర్ ప్రభుత్వం రైతులకు శాశ్వతంగా భూమిని దున్నుకునే హక్కుల నిచ్చినది. ననుకటివలె భూస్వామి ఇష్టం వచ్చినట్లు రైతులను తొలగించలేడు. భూస్వామి తనకు తానే సాగుచేసుకునే పక్షములో మాత్రమే రైతును తొలగించగలడు. దీనికికూడా కొన్ని నియమాలు ఏర్పరచబడినవి. జాగీర్దారీ శిస్తులు వసూలుచేసే జాగీరులు రద్దుచేయబడినవి. సొంతభూమి బొత్తిగాలేని రైతులకు, చాలస్వల్పంగా ఉన్న రైతులకూ 50 వేల కనాల్ (కొలత) ల ప్రభుత్వభూమి ఇవ్వబడినది.

వ్యవసాయాన్ని అభివృద్ధి చేయటానికి అనేక ప్రయత్నాలు చేయబడుతున్నవి. ట్రాక్టర్లను సప్లయి చేయవలసినదని ప్రభుత్వము ఇండియా ప్రభుత్వమును కోరినది. కాశ్మీర్‌లో వరి సాగుబడి అయ్యే భూములలో ట్రాక్టర్లు ఉపయోగపడునా లేదా అను విషయముపై నిపుణులు సూచించవలసి వచ్చినది. జమ్మూ రాష్ట్రంలో మటుకు ట్రాక్టర్లు యథేచ్ఛగా ఉపయోగించవచ్చును. అంతేకాక అక్కడి పశువులలో చాలాభాగాన్ని శత్రువులు చంపివేయుటయో, తోలుకొని పోవుటయో జరిగినది కనుక అక్కడ ట్రాక్టర్లు చాలా అవసరం.

### విద్యుచ్ఛక్తి: రవాణా

కిందటి సం॥ లో ఆగిపోయిన పరిశ్రమలు, ఫ్యాక్టరీలు మళ్లీ పనిని ఆరంభించినవి. వాణిజ్య నెరుకటి మొత్తంలో మామూలవం తే ఉన్నప్పటికీ అది కూడా కోలుకుంటున్నది. కాశ్మీర్‌లో విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు గల అవకాశాలన్నిటినీ వినియోగించుకోవలసి ఉన్నది. జలోత్పాదక విద్యుచ్ఛక్తి యంత్రాలను కొనుటకు ఫ్రాన్సు, జెకోస్లవేకియాల కంపెనీలతో సంప్రదింపులు జరుగుతున్నవి. దేశంలో నివారణావ్యవస్థ అంతా జాతీయం చేయబడినది.

### పట్టు పరిశ్రమ

పట్టు పురుగుల గుడ్లను చైనా, ఫ్రాన్సుల నుండి తెప్పించి పట్టుపరిశ్రమ నభివృద్ధి చేయుటకై కాశ్మీర్ అధికారులు కృషి చేస్తున్నారు. మల్బెరీచెట్ల (పట్టు పురుగుల ఆహారం) పెంపకానికి ఒక పంచవర్ష ప్రణాళిక వేయబడినది. ఇటలీ నుండి, ఫ్రాన్సునుండి పట్టుపురుగు గుడ్లు కొన్ని అప్పుడే వచ్చినవి. వీటినుంచి ఈ సం॥ 7 వేల పౌన్లపట్టు ఉత్పత్తి కాగలదు. పట్టు నేతను ఒక గృహపరిశ్రమగా అభివృద్ధిచేయుటకై ముడిపట్టు ఎగుమతు లన్నిటిని ఆపి, దేశంలోని సాలీలకే ఇవ్వటం జరుగుతున్నది. వీరు నేసినపట్టు నంతటినీ ప్రభుత్వ ఎంపోరియమే కొని బయటి ప్రాంతాలకు ఎగుమతి చేస్తుంది.

### కార్మికుల సౌకర్యాలు

ప్రభుత్వ స్వాధీనంలో ఉన్న ఫ్యాక్టరీలన్నిటిలోనూ కార్మికుల జీతాలు పెంచబడి, వారి సంస్థాలు గుర్తించబడినవి. కార్మికులకు గ్రసుభిత్యాలే కాక, ఏడాదికి రెండు నెలల జీతం బోనసు ఇవ్వబడుతున్నది. దళారులను తొలగించుటకై సహకార పద్ధతి ప్రోత్సహింపబడుతున్నది.

### కాశ్మీర్-భారత సంబంధాలు

కాశ్మీర్ భారతదేశంలో చేరుటను జాతీయమహాసభ ఈమధ్యనే స్పష్టపరచినది. కాశ్మీర్‌కు భారతదేశంతో గల సంబంధాలు ఈనాటివి కావు. జాతీయమహాసభ నిరంకుశ పాలనను ప్రతిఘటిస్తూ తీవ్ర పోరాటం జరుపుతున్నంతకాలమూ కాంగ్రెసు, నాయకులు కాశ్మీర్‌కు తోడ్పడిరి. కాశ్మీర్ స్వాతంత్ర్యోద్యమం మతసర్గ ప్రాధాన్యతారహితమైనది కనుక కాశ్మీర్ భారతదేశంలోనే చేరకలిగినది. కాని మతసిద్ధాంత ప్రాధాన్యతకలిగిన పాకిస్థాన్‌లో ఎన్నటికీ చేరలేదు. కాశ్మీర్ ప్రజలకు తమ ఆశయాలకు భారతదేశమువూ ఎమీ సాయపడునని తెలుసును." (అ. ప్రె.)

# లండన్‌లోని రష్యన్ రాయబారుల కవమానం

## విషిన్‌స్కీ ఆరోపణ

పారిస్, నవంబర్ 13: లండన్‌లోని సోవియట్ రాయబార కార్యాలయంపై 30, 40 మంది రౌడీలు కేకలు వేసుకుంటూ, అవమానకరంగా దూషిస్తూ దాడిజరిపిరనీ, సోవియట్ పతాకానికి, రాయబారవర్గము నకూ జరిగే ఘోర అవమానాన్ని అధికారులు చూస్తూ ఊరుకొన్నారని నేడు సోవియట్ ప్రతినిధి విషిన్‌స్కీ ఐ. రా. రాజకీయసంఘంలో తీవ్రమైన ఆరోపణ చేసెను.

రష్యాలోని విదేశ రాయబారులు స్వేచ్ఛగా తిరుగుటకు, రాయబారహక్కుల నుపయోగించుకొనుటకు వీలులేదన్నదని బ్రిటిష్ ప్రతినిధి హెక్టర్ మెక్నీల్ నిన్న చేసిన ఆరోపణకు సమాధానమిస్తూ విషిన్‌స్కీ పైవిధంగా అన్నాడు. "మీదేశాలలో రాయబారుల హక్కులు కాపాడుతున్నాయని మీరనవచ్చుకాని, కార్యాలయం విడిచి ఏరాయబారి అయినా కర్మంబాలక బయటికివస్తే ఈవిధంగా అవమానించడం, ఈలలువేయడం, కొట్టడం కూడా జరుగుతున్నది." అనికూడా విషిన్‌స్కీ అన్నాడు.

### కీ॥ శే॥ హార్నిమన్‌గారికి

లండన్‌లోని భారతీయ పత్రికా విలేఖరుల జోహార్లు

లండన్, నవంబరు 13: కడచినమాసము నందు కాలధర్మమునందిన, బొంబాయిలోని సుప్రసిద్ధ పత్రికారచయిత బి. జి. హార్నిమన్‌గారికి, లండన్‌లోని భారతీయ పత్రికా విలేఖరుల సంఘమువారు సమావేశమై జోహారు లర్పించిరి.

హార్నిమన్‌గారు, తన కలమును కత్తిగా ఉపయోగించి అన్యాయముల నెదుర్కొనిన మహాపురుషుడు. ఆయన తనహృదయ సర్వస్వమును భారతస్వాతంత్ర్య సమరమునకు అంకితముచేసుకొన్న వీరపురుషుడు. భారత విజ్ఞానలోకమంతయూ వారి దివ్యస్మృతికి జోహారులర్పించుకొన్నది. ఆ సోదరులతో పాటు మేముకూడ భక్త్యాంజలు లర్పించుచున్నాము' అని తీర్మానమును అంగీకరించిరి.

ఆ పత్రికారచయితల సంఘము అధ్యక్షులైన యస్. కబాడేగారు 'కడచిన అర్ధశతాబ్దికిపైగా భారతీయ పత్రికా ప్రపంచమునందు, హార్నిమన్‌గారు ఒక ఉత్కృష్ట స్థానము నాక్రమించియున్నారు. ఆయనమృతి భారతీయపత్రికాప్రపంచమునకు తీరని నష్టము.

### ఉపఎన్నికలలో బ్రిటిష్ కార్మికపక్షవిజయం

లండన్, నవంబరు 14: ఉత్తర లండన్‌లోని ఎడ్మంటన్ నియోజకవర్గములో గత రాత్రి జరిగిన పార్లమెంటు ఉపఎన్నికలలో బ్రిటిష్ కార్మిక పక్షం గెలిచి మరొక స్థానమును సంపాదించినది. కన్సర్వేటివ్ ప్రత్యర్థి ఓడిపోయినాడు.

1945 నుండీ అప్పుడప్పుడు జరిగిన మొత్తం 29 ఉపఎన్నికలలో 28 కార్మిక పక్షమే గెల్చినది.

# పాకిస్థాన్‌ను ఏకరాష్ట్రముజేయు ఆలోచన

కరాచీ, నవంబరు 10: పాకిస్థాన్ మొత్తమును ఏకరాష్ట్రముగచేయు విషయమై పాకిస్థాన్ ప్రభుత్వము తీవ్రముగ ఆలోచించుచున్నట్లు తెలియుచున్నది. కాయిదే ఆజాం జిన్నాకు ఆర్థిక సలహాదారుగా పనిచేసిన సర్ వాల్టర్ మాంక్టన్ ఇదివరలో ఇదే సలహా యిచ్చెను. దేశము మొత్తము ఏకరాష్ట్రమైన పరిపాలనా నిర్వహణ వ్యయము చాలావరకు తగ్గగల అవకాశము వున్నందున జిన్నాకు ఈ సలహా నచ్చెను. కాని, వివిధ రాష్ట్రములు ఇందుకు ప్రతికూలముగ వుండుటచేత తాత్కాలికముగ ఈ ప్రతిపాదన ఆపివేయబడెను.

ఏకరాష్ట్రముగ నిర్మించినచో పాకిస్థాన్‌కు ఆర్థిక సౌష్ఠవము లభ్యము కాగలదని వాదించు కేంద్ర ప్రభుత్వాధికారులు యు. పి. రాష్ట్రములో 53 జిల్లాలున్నను పరిపాలన సామర్థ్యముతో సాగుటలేదా అని ప్రశ్నించుచున్నారు. పాకిస్థాన్‌లో మొత్తము 40 జిల్లాలు మాత్రమే వున్నందున ఈ సూత్రమును యెందుకు వర్తింపజేయరాదని వీరు తమ వాదనను బలపరుచుకొనుచున్నారు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.